కేశవరావు, తుమ్మలగుంట

కమల

గుంటూరు, 1915

Record no.188

Kēśavarāvu, Tummalaguṇṭa

Kamala

Guṇṭūru, 1915

Record no.188

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

కేశవరావు, తుమ్మలగుంట.

కమల / ఇది తుమ్మలగుంట కేశవరావు, రత్నాకరం వేంకటప్పయ్య గార్లచే రచియింపబడినది.- గుంటూరు : చంద్రిక ప్రెస్, 1915.

(1), 45 p. ;17 cm.

Record no.188

Kēśavarāvu, Tummalaguṇṭa.

Kamala / idi Tummalaguṇṭa Kēśavarāvu, Ratnākaraṃ Vēṅkaṭappayya gārlacē raciyimpabaḍinadi.- Guṇṭūru : Candrika Pres, 1915.

(1), 45 p. ;17 cm.

Record no.188

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB          Date filming began:

ప్రవేశ సంఖ్య. 53

శ్రీ

సారస్వత నికేతనము, వేటపాలెం.

ఇండ్లకు గ్రంథముల గొనిపోవుట కొరకైన దరఖాస్తు.

పాఠకుని పేరు [illegible]

తండ్రి పేరు [illegible]

వయస్సు 21 కులము [illegible] వృత్తి [illegible]

ఆన్ధ్రవాణీగ్రం

ఇది

# తుమ్మలగుంట కేశవరావు,
# రత్నాకరం వేంకటప్పయ్య

గార్లచే రచియింపఁబడినది.

1915.

రిజిష్టర్డుకాపీరైట్.

చందాదారులకు. వెల రు 0-2-0

ఇతరులకు. 0-3





ఆన్ధ్రభాషాభిమానులరగు నోయాన్ధ్రసోదరీసోదరులారా!

ప్రస్తుత మాన్ధ్రభాషామతల్లికి నూతనకుసుమంబుల నొడఁగూర్చుచున్న విజ్ఞానచన్ద్రికాది సోదరీమండలులకుం బలె మాతృభాషామతల్లికి సేవఁజేయఁదలచియే నే నీయుద్యమమునకుఁ బూనితిని. కాని నాపూనినకార్యమున కాన్ధ్రమాతృపుత్రపుత్రికల సహాయము లేకయే నెరవేరదనెడి దృఢనమ్మికఁ గలదాననగుటచేతను, నాయీసదుద్యమమునకు స్వభాషాభిమానులగు నాసోదరీసోదరులు తోడ్పడుదురనెడి విశ్వాసముచేతను, మాతృభాషాసేవకైఁ గడంగితిని. అట్లే నాసోదరులుకొందఱు నాకుఁ జేయూతనొసంగి ప్రోత్సాహ మొసంగిరి. ఇక ముందును తగుసహాయ మొనరించి యెక్కుడుత్సాహకురాలనుగాఁ జేసెదరని యాన్ధ్రపాఠకలోకమున కొక్కపరి విజ్ఞప్తి యొనరించుచున్న దానను.

ప్రస్తుత మొక వత్సరమువరకును నూరుపుటలకు లోపల నుండునవలలనే ప్రకటింపఁదలకొంటిని. ఆన్ధ్రపాఠకబృందము నాయందు దమకటాక్షవీక్షణముల నొకపరిఁ బఱపినచో ద్వితీయవత్సరమున పెద్దపొత్తములనే యాంధ్రలోకమున కందఁజేయఁగలననెడి నమ్మికఁగలదు. కావున నాయుద్యమమునకుఁ దగువిధసహాయ మొనరించుఁడని నాసోదరీ సోదరలోకమునకు మరలనొకపరి హెచ్చరించి విరమించు,

ఇనగల్లు.
8—11—1915

మీయనుంగుసోదరి,
ఆన్ధ్రవాణి.



# కమల.

## మొదటిప్రకరణము.

### చరిత్ర.

గీ॥ కన్నబిడ్డలకుంబలె గారవమున
తనదుప్రజలనుఁ బ్రోచిన, తండ్రిపగిది
భక్తివిశ్వాసములనుంత్రు ప్రభువునందు
కష్టములఁగూర్చుచుండిన గౌరవంబు
సున్న యగుగాఁదె రాజనియెన్నఁనగునె?॥

చిత్రవిచిత్ర సౌధరాజములకునిలయమై, నానావిధవస్తుసముదాయములకాకరమై, నవరత్నములకావాసమై, సర్వసౌఖ్యములకుస్థానభూతమై, పేరెన్నికగన్న నగరరాజములలో మేటియై చెలంగు ధాన్యకటకమను పత్తనరాజంబొకప్పుడాన్ధ్రరాజ్యమునకు రాజధానియై యొప్పియుండె.

ఆన్ధ్రరాజ్యస్థాపక మహామహుని ధ్యానించుటకు జరిత్రములెవ్వియు లేకున్నను, పురాణములవలనను, జనసామాన్యమువలనను, ఆన్ధ్రవిష్ణువను మహాపురుషుఁడని మాత్రము దెలియఁదగు.

ప్రస్తుతమనకథ జరుగుకాలమున, ఆన్ధ్రరాజ్యమును, శ్రీముఖశాతవాహనుఁడను ఱేఁడు ధాన్యకటకమును రాజధానిగాఁజేసికొని పరిపాలింపఁదొడగె. ఈ మహామహుఁడు, స్వదేశ, స్వమతరక్షణార్థమై తన బాహుపరాక్రమమునుపయోగించి శాశ్వతకీర్తిని గడించిన మేటిఘనుఁడు.

మనకథాకాలమునాఁటికి భారత భూభాగ మంతయు నెక్కుడు కల్లోలములకు నాలవాలమై యున్నదని చెప్పిన యప్పటి దేశస్థితి యెట్లుండునో తెలిసికొనఁదగు. మన భారతభూమి యందేనాఁడు కలహదేవత ప్రవేశించినదో గాని, నేఁటివరకును నియ్యెడనుండి కదలుట కుద్యమింపదయ్యె;

ఇప్పటి కొండకోయలు, ఎఱుకలు, చెంచులకుఁబలె, ఒకప్పుడు మనయాన్ధ్రసంతతి, ఒకచోనిలువక, ఒకకృషిసలుపక యనేకవిధముల, నాయాచోటులనెల్ల నరసి యిచ్చవచ్చిన బనులఁ జేసికొనుచు, అనేకబాములబడి జీవింపఁదొడంగిరి. అట్లు భృత్యులుగానున్నతరి, కొందఱు మేధాసంపన్నులును, వీరవరులును నుద్భవించి, తమ యవక్రపరాక్రమమువలనఁ గొంత భూభాగమునకు రాజులైరి. అట్లు రాజులైనవారిలో నొకఁడును, ఆన్ధ్రరాజ్యమును తన నిర్వక్రపరాక్రమముచేనలు దిశలఁబ్రసరింపజేసి, తనపూర్వుల భృత్యత్వము నెడఁబాపి కీర్తిగన్న వీరవరుఁడును, తన నామమును శాశ్వతముగానుండు



నట్టు తనపేర శకము నెలకొల్పిన పురుషవర్యుండునునగు, శాతవాహనుఁడను ఱేఁడే యీ శ్రీముఖునివంశమునకు మూలపురుషుఁడు. శాతవాహనునే ప్రాకృతభాషయందు శాలివాహనుఁడందురు. అట్టి శాలివాహనవంశమం దుద్భవించి, తన బాహుపరాక్రమతచేఁ దనవంశజునికన్న మేటిధీరుఁడై, భారతభూభాగమంతయు, యవన, శక, పహ్లవాది శాత్రవులచేఁ జుట్టుముట్టఁబడి పలునిడుముల కాస్పదమైయున్నతరి, ఆన్ధ్రరాజ్యలక్ష్మికి మగధరాజ్యము తోడగునట్లు చేసి, ఏకచ్ఛత్రాధిపత్యముగా నీ భూభాగము నేలి, తనపూర్వుని యశస్సునునిల్పిన యీయాంధ్రుని పరాక్రమతయును, రాజ్యపరిపాలనా నిపుణత్వమును, మా చదువరులు ముందు ప్రకరణములందుఁ జూడఁగలరు.



# కమల.

## రెండవ ప్రకరణము.

### జన్మదినోత్సవము.

గీ॥ పరుల కుపకార మొనరించు పరమపురుష
జీవనచరిత్ర వినెనేని చెనటునకును
ధర్మపథమును, సత్యంబుధైర్యమబ్బ
కుండునే? యుత్తములమార్గ, మొప్పుగాదె?॥

మహాపురుషుల జన్మదినోత్సవములు, దేశాభిమాన ప్రబోధితంబులును, జాత్యభిమాన ప్రవృద్ధంబులును, ధైర్యోత్సాహ పూరితంబులునునై బరగుచుండును. నేఁడు హిందువులు మూఢవిశ్వాసముచే మెలఁగుచున్నను ఒకప్పుడు నాగరకతాగ్రగణ్యులై, దేశాభిమానపూరితులై, పరాక్రమధీరులై బరగిరనెడిదానికి నిదర్శనములెన్నియేని నేఁడు మనము కనులారఁ జూచుచున్నారమనుట యసత్యమా?

నేఁడు ధాన్యకటకమున శాతవాహన మహావీరుని యొక్క జన్మదినోత్సవము నెరపుచున్నారు. ఇయ్యది రాజుగారి వలననే జరుపఁబడుచుండుటచేత నెల్లరు, తమతమ గృహముల చిత్రవస్తుజాలములచే నలంకరించి, యుత్సాహవంతులయి యుండిరి.

శాతవాహనజన్మదినోత్సవ మాంధ్రదేశమందలి వీరవరులందఱికినొక యుత్సాహజనకమయిన యుద్రేకము గలుగుచున్నయది. ఏలయన? ఆరోజున విలువిద్యయందుత్తీర్ణులైనవారికి, రాజుగారిచే నొక బహుమానమిచ్చు నట్లేర్పరుపఁబడియుండెను.

అందువలన, ఆంధ్రదేశమందలి యువకులందఱు, తమతమ ధనుర్విద్యాప్రభావమును జూపి, పారితోషికమంద సాహసించుచుండిరి.

నానావిధవాద్యవిశేషములతో శాలివాహనమహాపురుషునియొక్క విగ్రహమునూరేగించుచు రాజమందిరాంగణమునకు దవ్వులనున్న వీరుల మెట్టపైకి తెంచిరి. అటకు రాజుగారును వారియనుచరులును, ఉచితవస్త్రాలంకారులై యరుదెంచిరి. యౌవనులందఱు విల్లనంబుల కేలఁబూని చూపరుల హృదయానంద మొనరించుచు సంతోషస్వాంతములఁ దులఁదూగుచుండిరి. సందడియంతయు నణఁగినపిమ్మట మంత్రియగు సుగుణవర్మ లేచి యా ప్రేక్షకసమూహముఁజూచి యిట్లుపన్యసింపదొడఁగెను.

"ఓపరాక్రమనిధులగు నాంధ్రవీరులారా! నేఁడు మన వంశీయుఁడగు నాంధ్రమహావీరుని జన్మదినోత్సవమై యున్నది. మహాపురుషుల జీవనచరితంబులు, పరోపకార పరాయణత్వమును, దేశోపకార నిశ్చలత్వమును ప్రబోధించునని వేరుగఁ జెప్పనక్క

అయ్యే లేదుగదా? అట్లే, ఈశాతవాహన మహాయోధుఁడు తన యవక్రపరాక్రమముచే నాంధ్రరాజ్యాభివృద్ధిఁ బొందించి భృత్యులుగానున్న యాంధ్రుల విముక్తులఁ గావించెను. కావున, ఆ మహావీరుని స్మరణార్థమై నేఁడీయుత్సవము నెరపుచున్నారము. ఇందువలన, మనమందఱమా వీరుని మార్గముఁ ద్రొక్కునట్లు బ్రయత్నించుటే మనమిందు నేర్చుకొనెడినీతి. మఱియు, ఈయుత్సవము వీరపద్దైయుండుటవలన ధనుర్విద్యానిపుణులకొక బహుమానము రాజుగారిచ్చునట్లేర్పరచిరి. కావున, ఆంధ్రవీరులు తమతమ బాణకౌశలముఁ జూపి యీపారితోషికము రాజుగారిచేఁ బొందెదరుగాత."

అని యనుటయొడనే యావకులందఱు తమవిల్లునంబుల సవరించుకొని సంసిద్ధులై యుండిరి. అంతట, రాజాజ్ఞచే ననుజ్ఞాతుఁడైన రాజకీయోద్యోగి యొకఁడిట్లు నుడివెను.

"పరాక్రమధనిధులగు నాంధ్రవీరులారా! అల్లదే యెదుట నున్నతస్తంభాగ్రముపై నిర్మింపబడిన మత్స్యయంత్రమును, దర్పణమందు లక్ష్యముంచి యెవ్వఁడు దునుమునో వానికి వీరోచితబహుమతి నొసంగఁబడును" అనెను. అంత యువకులందఱు తమతమశరముల దిటవుపరచుకొనిరి. పిమ్మట నొక్కొక్కరే దర్పణమందు లక్ష్యముంచి యంత్రమును భేదించ ప్రయత్నించిరి. కాని, అట్లు లక్ష్యముకుదిరి యంత్రనిర్మూలనముగుట వల



నుపడదయ్యెఁ; ఆనాఁటియుదువందల యాంధ్రవీరులా పారితోషకమునకై ప్రయత్నించిరి. కాని, ఎవ్వనికిని యీ యంత్రనిర్మూలన మసాధ్యమయ్యెను. ప్రేక్షకులందఱు "అట్టి వీరుఁడీనాఁ డెవ్వఁడుఁగలఁడు?" అని నిరుత్సాహతఁ గనుపరచుచుండిరి. ఇంతలో యీ జనసమూహములో రెండువైపులనుండి యిరువురు యువకులు రంగస్థలమున కరుదెంచిరి. అందొకఁడిట్లు రెండవవానితో నుడివెను. "రంజితా! ముమ్మందు నీచెలికాని బాణకౌశలముఁ జూచెదవుగాత" అని దర్పణమందు లక్ష్యముంచి శరమును వదలెను. కాని, కొంచెము గురితప్పుటచే యంత్రమును భేదింపఁజాలదయ్యె. అంత రెండవవాఁడగు రంజితుఁడిట్లునుడివెను. "ఆంధ్రరాజ్యరమాశాసనకర్తయగు శ్రీముఖశాతవాహనమహారాజా! ఆంధ్రపుత్రవతంసులగు ప్రేక్షకులారా! పారితోషికమునకై యీయల్పబాణవిద్యావంతుఁడను ప్రయత్నమొనరించెడి." అని దర్పణమందు లక్ష్యముంచి నొకశరమును విడచెను. అయ్యది తక్షణమే యంత్రనిర్మూలన మొనరించి ప్రేక్షకసమూహమున కానందము గొల్పెను. తదుపరి, రాజుగారు కోలాహలమంతయు జల్లారునట్లుఁ జేసి యిట్లుపన్యసించెను.

"ఓ యాంధ్రరాజ్యరక్షకవీరవరపుత్రా! రణవీరప్రవర్ధిత రంజితా! నీ లక్ష్యమునకును, బాణకౌశలత్వమునకెంతయు డెంద మానందమయ్యెఁ; నేఁటిదినమున నీపారితోషికము

నకు యత్నించిన పంచశతయువకులలో నీవు త్తీర్ణుఁడవగుటచే నీకావీరబహుమాన మిదేనిచ్చుచున్నాఁడ" అని యొకసువర్ణపతకమావీరుని గళమున నలంకరించెను. ప్రేక్షకులందఱు "ఆంధ్రమాతకుజయ్! ఆంధ్రవీరునకుజయ్!" అనుచు తమతమ యానందముల వెల్లడించిరి.



# క మ ల.

## మూఁడవ ప్రకరణము.

### ఈర్ష్య.

గీ॥ సజ్జనులు జేయుకార్యంబు సంతతంబు
ప్రజల కుపకారమొనగూర్చు రంజకమగు
దుర్జనులకది యత్యంతదుస్సహమగు
సహజవైరులు దుర్జనుల్ సజ్జనులకు॥

శాతవాహనవీరోత్సవమునాఁడు పారితోషికముకై ప్రయత్నించిన యువకులలో మాధవుఁడొకడై యుండెను. కాని, ఆ బహుమానము రంజితునకే జెందుటచేత, రంజితునియందు మాధవునకు వెనుకటికంటె యీర్ష్య మిక్కుటమయ్యెను. అందువలన, మాధవునకిప్పుడు రంజితుడనిన, అగ్నిహోత్రున కాజ్యమిడినట్లు క్రోధాగ్ని ప్రజ్వలించుచుండెను.

రంజితుడు శ్రీముఖుని సైన్యాధిపతియగు రణోల్లాసుని పుత్రుడు. ఇరువదివత్సరముల ప్రాయముగల సకలసద్గుణనిధి.

మాధవుడు కొత్వాలు పుత్రుడు. ఇరువదిరెండు వత్సరముల వయస్సుగల నవయావనుడు. వీరుడేకాని, దుష్టవర్తనుడగుమిత్రుని చెలిమివలన, దుర్మార్గుడై చరించుచుండెను.

మాధవుని ప్రియమిత్రుఁడు, సూనుడనియును, రంజితుని ముఖ్యసఖుడు, బలవర్ధనుడనియును, మాపాతకు లెఱుంగుదురుగాత.

వీరునల్వురు తొలుత స్నేహభావముతోనే వర్తించుచుండిరిగాని, మాధవ, సూనులదుశ్చేష్టలు, రంజిత బలవర్ధనులకుగిట్టకె వారిని నాదుష్పథమునుండి బయలుపడుటకుగా హితబోధం జేసిరి కాని, అడవియందు వెలుగు వెన్నెలకుంబలె వీరు జేసిన హితబోధ వారితలకెక్కక వీరియందొకవిధమైన యసూయ గలిగెను. అంతటినుండి కృత్రిమభావముతో మాటలాడుచున్నను, మాధవసూనులొకటియు, రంజిత బలవర్ధనులొకటియుగా సంచరించుచుండిరి. అట్లు మనోవ్యథలచేనుండుతరి, శాలివాహన వీరోత్సవమునందు, రంజితుండె విజయమొందుటయు, మాధవునకు రంజితునియం దాగ్రహము మిక్కుటమగుటకు ముఖ్యకారణమయ్యెను.

మాధవసూను లిరువురునిపుడు ధాన్యకటకమునకుం దూర్పుగానున్న సరోవరోపరిభాగమున కూర్చొని యేమేమో ముచ్చటించుచున్నారు. అందు కొంతభాగము మా పాఠకులకు శృతపర్చుటుచితమనియెంచి, వారివద్దకేగుట కాహ్వానించుచున్నాము.

"మాధవా! మనమిక యుపేక్షంజేసిన ముప్పు సంభవించుట నిశ్చయము. కావున, నెద్దియేని పన్నుగడంబన్ని వానినంతమొందింపవలయు".

"సూనా! నేనును ఆ విషయమే యాలోచించుచుంటిని. కాని, ఎవ్విధముగా వాని త్రుళ్ళుపాటణచవలయునో యెఱుంగనయితిని. ఇందులకు నీవే నాకుదగుమార్గము జూపవలయును".

"సరియే దానికిదగుయుక్తి నాలోచించి యీరాత్రికే దమకు నివేదింపగలను. కాని, మీరుమాత్రము దగు జాగ్రతగా నుండుడు".

"మంచిది".

అంత వారిరువురు తమతమ సౌధగమనోన్ముఖులైరి.



# కమల

## నాల్గవ ప్రకరణము.

జవ్వని.

గీ॥ దుష్టులాచరించు దుర్మార్గవృత్తులు
సజ్జనులకు ప్రాణసంకటములు
భువి బిడాలలీల మూషికంబుకు ప్రాణ
సంకటంబుగాదె సత్యముగను॥

" హా! పరమేశ్వరా! ఎట్టికష్టములఁబాలు జేయుచుంటివి? కట్టా! ఎంతయో దయజూపి నన్నాక్రూరులబారినుండి గాపాడి రక్షించెదనని గంకణముకట్టుకొనిన యా దయామయునికిగూడ యాపదవాటిల్లె. అబ్బా! ఒక్కమారాయుదార స్వభావు దలంచినంతమాత్రముననే నాహృదయము చెక్కలై పోవుచున్నయది. అన్యురాలనగు నేనే యాకృపాళునికై యింత వగఁబొందుచుండ నిఁక నా దీనోద్ధారకు దలిదండ్రు లెట్లుగుందుచున్నారో యెవ్వనికెఱుక? అయ్యో!ఎవనికెఱుకయని యననేల? ఇంతకముందాయుదారశీలుని మాతృసోదరి శోకమును గనులారగాంచితినని జెప్పిన నాసుగణమణిమాట నెట్టికఠినహృదయులనయిన గరగింపకున్నే?

హా! దైవమా!! నీవీదుర్మార్గులగు మాధవ,సూనుల నేలసృజించితివి? ఇట్టిదుష్టులచే నెద్దియైన మేలు దేశమున కొన



గూడునని యుద్భవింపజేసితివా? అవును. నీవలనఁగావింపఁబడిన ప్రతికార్యము మంచిగానే పరిణమింపఁబడునని పెద్దలు వచించుచుందురు. కావున ఎద్దియేని మేలొనఁగూర్చుటకే నాదుష్టాత్ముల సృజింపఁజేసి యుండనోపు.

ఛీ! అది యెట్లువిశ్వసింపఁదగు. పాపముఁజేసినప్పుడెంతటివాఁడైన శిక్షార్హుఁడేయని సత్యగ్రంథము లుద్ఘోషించుచుండ పుక్కిటిపురాణంబులభాతిఁజెప్పు పెద్దలవాక్యము లెట్లునమ్మఁదగు.

అయ్యో! నేనెంతబేలను? నాతెరవెద్దియో జూచుకొనక వృథాచింతచేఁగాలము వెళ్లబుచ్చుచుంటి. నేనిప్పు డెక్కడికేగిన రక్షణకల్గును? మరచితి. నా కింకెక్కడిరక్షణము? పాపాత్ములగు నీమాధవ, సూనుల బారినుండి దప్పినఁగదా? నాబ్రతుకు.

అమ్మా! ఆన్ధ్రమాతా!! పరాక్రమోపేతులును, ధీవిశారదులును, యశోధనులును, రణవీరాగ్రగణ్యులును, న్యాయైకదక్షులును, పతివ్రతారక్షకులును, శరణాగతత్రాణులునగు వీరవరులఁగన్నకడుపున, పందయు, లోభియు,అన్యాయప్రవర్తకుఁడును, పరవనితాపహారియు, పరధనాసక్తుఁడును, నీచుఁడునగు నీమాధవు నేలగంటివి?

నేనీమాధవు, సూనుల, మాయానాగురులకుంజిక్కఁజ

చ్చినను మంచిదేగాని, దీనులపాలిటి కల్పవృక్షమై, పండితజన పారిజాతమై, శరణాగతత్రాణుఁడై, వీరాగ్రగణ్యుఁడై, బాహుపరాక్రమోపేతుఁడైన యాసుగుణుని మరల నొక్కపరి కన్నులారగాంచెడి భాగ్యముఁగలిగిన నాయీజన్మము ధన్యతనొందును. మరచితి. ఆసదయుఁడు కారాగృహమున కేతెంచునప్పుడు నాకంపిన లేఖయం దేమిలిఖించెనోఁ గనుఁగొనెద.

"యువతీ!

నేనిప్పుడు ప్రాణిహింసా మహాదోష మొనరించిన యపరాధిగా నెంచఁబడి కారాగారమునకు రాజభటులచేఁగొంపోఁబడుచున్నాఁడను. కాని ఇప్పుడీఘోరకృత్యము నాపై నెలకొల్పినవారెవ్వరైనది నాకు గోచరంబే అయినను నేఁజెప్పువాక్యముల నెవ్వరు నిప్పుడు విశ్వసింపఁజాలరు. కానిమ్ము నాగతి యెట్లుగానున్నదో యటులగును. కాని నీవుమాత్రము నాకై పరితపింపక నాయీమృషాపరాధపర్యవసానమెట్లగునో చూచి నేను నిన్నుఁజూచుట దూరమయ్యెనేని నీయిష్టమైన నొకరాచకుమారునిఁజేపట్టి నీ సుసీలత్వమును లోకమున వెల్లడించుము. నీ కొలఁదికాలపరిచయుఁడును, ప్రస్తుతరాజభటబద్ధుఁడునైన నీ దీనునిఁగడసారి యాశీర్వచనముఁ గైకొనుము.

ఇట్లు, రంజితుఁడు"

కట్టా! ఆసుధీవరుఁ డెట్టివాక్యములు లిఖించెను. ఇట్టి కఠినవాక్యములు వినియును, నావజ్రహృదయము వ్రక్కలుఁగా



దయ్యె. "నేను నిన్నుఁజూచుట దూరమయ్యెనేని యిష్టమైన నొకరాజకుమారుఁ జేపట్టి నీసుశీలత్వమును లోకమున వెల్లడించుము" అనెడివాక్య మెంతభావగర్భితమై యున్నది?

ఆర్యకాంతల మనోభావముల నీతఁడెరింగియుండఁడు. కాదేని ఆతఁ డిందులకట్లు లిఖించును? మరియు ఇతఁడు, రుక్మిణీ, సావిత్రీ, మొదలగు సతీమతల్లుల వీరచరితంబులుఁజదివి యుండఁడు. కావున ఓ మహానుభావా! ప్రాణప్రియా!! నామనోద్దేశ్యముఁ దెల్పెద నాలింపుము. పావురమునకై మాసౌధమునకేతేర నీక్రేఁగంటిఁజూపుల కెప్పుడు లోనైతినో యానాఁడే నాప్రాణమానముల నీకర్పించితిఁగాన నీవు వేరుభంగినైనచో నాతుచ్ఛప్రాణములు యీబొందినుండి తృటికాలమున వీడిపోఁగలవు."

అని చింతించుచు నొకయెలజవ్వని ధాన్యకటకమందలి నొకసౌధముపైఁ గూర్చొనియుండెను.



# కమల.

## అయిదవప్రకరణము.

### దుష్టమండలి.

గీ॥ వనితయందలి మోహంబు వాస్తవముగ
ఘోరకృత్యంబులకు నేమికొంకనీదు
తొల్లియారంగ జేబు తా దుష్టకామ
బాధకుం జిక్కి ప్రజఁ బరిమార్ప లేదె!॥

ధాన్యకటకమందు సంపన్నుఁడైన గృహస్థుఁడగు నొక బ్రాహ్మణుఁడుఁగలఁడు. ఆబ్రాహ్మణునిభార్య సౌందర్యవతియు, సుగుణవతియునై, పతిసేవాతత్పరతయం దసమానురాలై, సర్వసద్గుణగనియని పేరెన్నికఁగని యుండెను.

మాధవుని తన యసమానకృత్యముల నన్నింటిని నేర్పి తనయంతవానిగాఁజేసి దుష్టుల నాయకత్వమును స్వీకరింపఁ జేసియున్నాఁడు సూనుఁడు.

హీనకులమందుద్భవించిన సూనుఁడు, యున్నతవంశమం దుద్భవించిన మాధవుని చెలిమిఁజేసి, తనదుష్టమిత్రుల నందఱిని మాధవునకు పరిచయులనుగా నొనర్చి, ఆక్రూరసమాజ నాయకత్వము మాధవున కిప్పించెను. వీరి చెలిమి స్వీకరింపక పూర్వము, మాధవుఁడు, సద్గుణుఁడనియు, సకలవిద్యాపారంగతుఁడనియు పేరెన్నికఁగనియుండెను. కాని ఇప్పుడాతనియంతటి



దుష్టుఁడీపుడమినుండఁబోఁడనియు, ఎప్పుడీతనినీధరణినుండి దూరగుఁజేసి పుణ్యముఁ గట్టుకొనెదవు దేవా? అని ఈశ్వరు నారాధించుచున్నారు పురజనులు.

మాధవుఁడు సామాన్యపౌరుని పుత్రుఁడు కాఁడు. ఒక యున్నతరాజకీయోద్యోగుని తనయుఁడు. ఆతని నేమనిన నాతనితండ్రిగారి కేమికోపమువచ్చునో, అందువలన యెట్టియిక్కట్లుపాలుఁగావలసివచ్చునోయని మాధవుని దుండగముల సహించి యూరకొనుచున్నారు ప్రజలు. ఎట్లు సహించుచున్నను, స్వల్పదుష్కృత్యములన్నియు యూరకున్న కొలఁది మెండై మాధవుఁడిప్పుఁడెట్టిఘోరకార్యముఁజేయుటకైన వెనుదీయుటకు సాహసించని నధమాధముఁడయ్యెను.

అట్టి దుండగీఁడైన మాధవుఁడు పూర్వోదాహృతమైన బ్రాహ్మణయువతి సౌందర్యాతిశయములఁగని మోహితుఁడై యాసుందరిని తనమక్కువఁదీర్పుమని రాయబారమంపెను. అందుల కాపతివ్రతాశిరోమణి యట్టిదుష్కృత్యమునకుఁ దన బోటి యున్నతరాజకీయోద్యోగిపుత్రుఁడు సాహసింపఁ దగదనియు, ప్రజలయందలి నీచకృత్యముల నెడబాపి సద్వర్తనావలంబకులగునట్లుఁ జేయవలసిన, వారిట్టిక్రూరకార్యమునకు లోఁబడుట శోచనీయమనియు, హితవాక్యముల నుడివెను. అందుల కాతఁడలిగి ఆ యమ నెవ్విధముననైన లోఁబరచుకొనదలఁచియును

రంజితునిపై నున్న యీర్ష్య నెరవేర్చుకొనఁదలఁచియును తనమి
త్రబృందముతో యాలోచనపడి వారి హితబోధప్రకారము
ఆసుదతీమణిభర్తను తామే గడతేర్చి రంజితునిపై నాప్రాణి
హింసామహాపరాధము నిడిరి. అందుపై రాజభటు లాతనిఁబట్టి
కారాగృహప్రవేశ మొనరించిరి. కారాగృహమున కేగున
ప్పుడే రంజితుఁడు తను వలచినకాంతయగు కమలకు లేఖయంపి
యుండెను. ఆలేఖను నాల్గవప్రకరణమందు మాపాఠకులు
చదివియే యున్నారు.

రాజకీయోద్యోగియగు సత్యవంతునికి సకలసద్గుణగణ
యు, సౌందర్యనిధియు, సౌశీల్యవతియు, నగు కమలయను
కుమరిత గలదు. ఆ యమ సద్గుణముల కచ్చెరువందికామించి
యున్నాఁడు రంజితుఁడు. ఆతని శౌర్యపరాక్రమాది వీరగుణ
ముల కానంద మొంది వరించియున్నది కమల. ఆ యిరువురి
ప్రేమాతిశయముల కధికానందపరవశులై యిరువురి తలిదం
డ్రులు వారికి పాణిగ్రహణమహోత్సవ మొనరింప సంసిద్ధులై
యుండిరి. ఆసమయమునందే రంజితునిపై జీవహత్యానేరము మో
పఁబడినది. ఆనందాంబుధి నోలలాడఁదలఁచిన రంజిత కమలలు
దుఃఖమునఁ బలుకష్టములపాలుఁగావలసివచ్చినదిగదా?

---

# కమల

## ఆఱవప్రకరణము.

## ఆత్మహత్య.

గీ॥ పరులచేఁగల్గు నిక్కట్లు పటుతరంబు
గాగ పసచెడి ధైర్యంబుకదలి ఆత్మ
హత్యగావించుకొనునది యార్యమతమ?
ధీరశాంతుని చిహ్నమా? తేలపడఁగ॥

"కట్టా! లేక లేకఁ గలిగిన నీవలన యెంతో వృద్ధిబొందవ
లయునని యువ్విళ్లూరుచున్న మాకు మా యదైవము నిన్నుఁ
గూడ దూరగురాలను జేసెగా?

అమ్మా! కమలా!! మనంబున వరించినంతమాత్రముననే
యెట్లాతఁడు పతియయ్యెను? పాణిగ్రహణ మొనరించినగదా పతి
యగుఁట. అట్టినీవు యింతలోనే యెందుల కిట్టుసాహసించితివి?
ఇఁక నీజన్మమున నీ సుందరతరతనువల్లిని గనఁజాలమైతిమిగా?

"హా! దైవమా!! ఇఁక నే నీభూమిపై బ్రతికియుఁ జచ్చి
యునొక్కటే,, అనిసత్యవతి మూర్ఛిల్లెను. సత్యవతి, సత్యవం
తునిభార్యాలలామయునియు, కమల జననియునియు వేరుగా
మాపాఠకులకుఁ దెలుపవలయునా?

అట్లాసుదతి మూర్ఛిల్లుటతోడనే, దాపుననున్న దాసి
యొకర్తుకవచ్చి శీతలోపచారములచే సేదదేర్చెను. అట్టితరి

నయ్యెడకు సత్యవంతుఁ డరుదెంచెను. తదుపరి ఆదంపతులిరువురిట్లు ముచ్చటించిరి.

సత్యవం:—సుదతీ! నీవిట్లు దుఃఖించుచుండిన యోదార్చువారెవరు? కమలమరణము నెఱింగించిన చారుమతి, ఇంకేమైన విషయములను దెల్పెనా?

సత్య:—రాత్రి తా నాదుర్మరణము నొందఁబోవునప్పుడొక కాగితమును చారుమతికిచ్చినదఁట. అదినాచేతికిచ్చి యేగినది కావున నందేమి వ్రాయఁబడినదో చూడుఁడు.

అంతట సత్యవంతుఁడా పత్రముఁగైకొని యందు లిఖింపఁబడినదాని నిట్లుఁ జదివెను.

"నాప్రియమైన జనకా!

నేనీదుర్మరణముఁ బొందఁబోవుటకుఁగారణము మీమానసంబున కెఱుకపడక పోవచ్చును. కావున మీకిందుమూలమున విస్పష్టమొనరించుచున్నదాన. ఏనరాధముఁడు నామనోహరుని చెఱకంపెనో, ఏమానవాధముఁడు ధాన్యకటకమందలి ప్రజకుకంటకుఁడై తనదుష్టమిత్రమండలిచే యలరారుచున్నాఁడో, అట్టి మాధవమానుషాధముఁడు, నామానభంగ మొనర్పదలఁబెట్టుటచే, నేనీఘోరకృత్యముకుఁ బాల్పడసాహసించితిని. కావున నాకై పరితపించు నాజనయిత్రిని యూరడించి, నాకుఁ-బలె ధాన్యకటకఁపు సుందరీమణుల నాయధమాధముఁడగు మా



ధవుఁబారిఁబడకుండ గాపాడుటకుగా, ఆదుష్టమిత్రమండలితో మహాధవుని నీధాన్యకటకమునకు దూరఁగుఁజేయుటకై మాత్రము ప్రయత్న మొనరింపుఁడు. మానధనరక్షణార్థమై నేనీకృష్ణానదీమతల్లిగర్భమునఁ జొచ్చుచున్నదాన. మీప్రియపుత్రికయొక్క కడసారి నమస్కారముల నందుకొనుఁడు.

ఇట్లు, కమల."

లేఖ సత్యవంతుఁడు కడముట్టఁజదివి, "హా! నాప్రియపుత్రీ!! నింకనే నీ నిరర్థకపుజీవనముఁ గడపుటకంటె, చచ్చుటే యుత్తమోత్తమము." అని పెల్లుగదుర దురపిల్లుచు తనసతీమణిపైఁబడెను. ఆమెయు మరల దుఃఖసాగరమునఁ మునికెను.



KTAPALEM

*

# కమల

ఏఁడవప్రకరణము.

విచారణ.

గీ॥ పలువురాఁడుమాట విలసిల్లు నేవేళ
సనృతమైననపుడె నాదరింత్రు
అపుడు చెల్లకున్న నాదరణీయంబె
యొక్కనరునిపల్కు నిక్కమరయ॥

రంజితునిపై మోపఁబడిన వ్యాజ్యవిచారణ నేఁడే ప్రస్తుతకథజరుగుకాలము క్రీస్తుశకమునకుఁబూర్వము డెబ్బదిమూఁడువత్సరముల క్రితమగుటచే, అపుడు కొత్వాలే న్యాయవిచారణకర్తయై యుండెను. ధాన్యకటకనగరమునకంతకు కొత్వాలు నియోగింపఁబడి యున్నాఁడు. అతఁడేమాధవునితండ్రి. న్యాయాధికారిపుత్రుఁడీయన్యాయప్రవర్తనుఁడై, అక్రమముఁ జేష్టలఁ జేయుచున్నాఁడు. అయినను వాని సహజగుణము కాకపోవుటచే నొకవిధమున యాతఁడు నిందార్హుఁడు కాకపోవచ్చును. "సంసర్గజా దోషగుణాభవంతి, సంసర్గజా పుణ్యగుణాభవంతి" అను యార్యోక్తికిఁబలె, ఆతని చెలికాఁడే యాతని దుర్వర్తనమునకుఁ గారణుఁడు.

విచారణసమయమునకు రాచకీయోద్యోగులందఱు న్యాయసభాభవనమునకుఁ జేరి వారివారి నియామకపుఁబనులయందప్రమత్తులై జరించుచుండిరి. ఆయావ్యాజ్యములయందలి విచారణీయులగు ప్రజలందఱు యేతెంచిరి. ఇంతలో కొత్వాలును యరుదెంచి తన నియమితపీఠము నలంకరించి తన దినచర్యయందలి ప్రథమభాగము ముగించినపిమ్మట రెండవభాగమందలి వ్యాజ్యముల పరిశీలనకుఁ గడంగెను. అందుఁ బ్రప్రథమమున రంజితుని వ్యాజ్యముఁబైకెత్తి అందలి నేరస్థుఁడగు రంజితునిఁ బిలపించెను. రాజభటులాతని శృంఖలాబద్ధునిచేసి తీసుకునివచ్చి యెదుటఁబెట్టిరి. తదుపరి దొరతనమువారితరపుసాక్షులనుఁ బిలపించెను. వారును న్యాయపీఠమునకెదుట నిలచిరి. అందు ప్రథమసాక్షియగు సూనుఁడు విచారింపఁబడెను. వాఁడు రంజితుఁడు నేరముఁ జేసినట్లుఁ బలికెను. పిమ్మట మాధవ, భూపులు విచారింపఁబడి పైవానియట్లె నుడివిరి. అంత కొత్వాలు రంజితునిఁజూచి యిట్లు నుడివెను.

"రంజితా! దొరతనమువారితరపున విచారింపఁబడిన మువ్వురుసాక్షులవలనను లోగడ తాణాదారంపిన ప్రజాభిప్రాయపుపట్టికలనుఁబట్టియు నీవు కామాతురుఁడవై రాజేశ్వరీపతియగు వీరవర్మను. జంపినట్లు స్థిరపరుపఁబడినది. కావున ఇందులకై నీవేమియుత్తరమిచ్చుకొనెదవో వేగమఁదెలియఁబరుపుము? అనెను.

అంతట రంజితుఁడు కొత్వాలుమొగంబై యిట్లు నుడివెను.

"అయ్యా! ఏతత్ప్రాణిహింసా మహాదోషమునుగురించి నాకించుకేనియుఁ దెలియదు. నేనట్టిపాపకార్యముఁ జేయుటకుఁ గలనైన యుద్యమింపఁ బూనువాఁడనుకాను. మరియు ఈ నేరమును నావిరోధులు నాపై యక్రమముగా మోపినదిగాని నాకిందు యణుమాత్రమేనియు సంబంధము లేదని నిశ్చయముగాఁ జెప్పువాఁడను."

కొత్వా:—నీ వీనేరముఁ జేయనట్లు నీకేమైన సాక్షులుఁగలరా?

రంజి:—సర్వసాక్షియగు యీశ్వరుఁడుఁ దక్క నాకెవ్వరును సాక్షులు లేరు.

అంతటఁ గొత్వాలు యావ్యాజ్యముయొక్క పర్యవసాన మిట్లుఁ దెలియపరచెను.

"ఈవాజ్యమందు నేరస్థుఁడు తనకేమియు సాక్ష్యము లేదని చెప్పుటవలనను దొరతనము వారితరఫున విచారింపఁబడిన సాక్షులుమువ్వురు రంజితుఁడు హత్యఁ జేయునప్పుడు చూచియుండుటవలనను మరియు తాణాదారంపిన ప్రజాభిప్రాయపుపట్టికలవలనను రంజితుఁడు హత్యఁ జేసినట్లే స్థిరీకరించుచున్నయది. కావున రంజితుఁడు మోహపరవశత్వముచే రాజేశ్వరినికోర పతివ్రతాతిలకమగుయామె యట్టి నీచకృత్యమున కొప్పమి ఉన్నత రాజకీయోద్యోగిపుత్రుఁడగుటచే యాయము



భర్తను యంతమొందించినట్లైన ఆయింతిని సులభముగా స్వీకరింపనగుననిఁ దలఁచి ఈఘోరహత్య నొనరించినాఁడు. అందువలననే భర్తృవియోగమునకు సహింపనొల్లని సతీతిలకమగు రాజేశ్వరీ పతిమరణవార్త వినుటతోడనే యాత్మహత్యపాలయ్యెను. కావున ఈతఁడిరువురిప్రాణములఁదీసిన నేరమునకుఁ బద్ధుఁడైయున్నాఁడు. కనుక న్యాయశాస్త్రమందు ప్రాణిహింసా మహాపాతక మొనరించినవానికి దేహాంతకశిక్ష విధింపఁబడినది. కావున రంజితునకు ఉరిశిక్ష విధించుచున్నాఁడ. మరియు ఈశిక్ష వచ్చుపున్నమదివసంబున నెరవేర్చునది" అని దెల్పెను. ఆ తీర్పునువిని రంజితుఁడించుకేనియు భీతినొందలేదు. కాని "దైవమా! ప్రాణిహింసా మహాపరాధమొకటి నాపై మోపి యంతమొందించుచుంటివా?" అని మాత్రము దనలో యనుకొనెను. అంతట రాజభటులతనిఁ గైకొనిపోయి కారాగృహముఁ జేర్చిరి. మాధవ, సూర, భూపులు, యానందపరవశులై తమతమ గృహముల కేతెంచిరి.



# కమల

---

## ఎనిమిదవ ప్రకరణము.

### రాజకీయోద్యోగి.

గీ॥ సత్యకార్యనియతి సంచరించెడువాఁడు
కష్టములనుబొంది కాలగతిని
దైవకరుణచేత తరలును వేగమ
ఉదధినుండివెడలు యోడభంగి॥

ఆహా! కడకిట్టిదుర్మరణము బొందఁబోవుచుంటినా? శౌర్యనిధియగు క్షత్రియకులమున యుద్భవించి రణవిజయుఁడగు రణోల్లాసుని పుత్రుఁడనై అగణితపరాక్రమ ధీవిశాలురగు యాంధ్రవీరులలో మేటినై చరించు నేను తుదకొక ప్రాణిహింసా మహాపరాధమొనరించిన నేరము మోపఁబడి యందుచే యసువుల వీడవలసివచ్చుటఁజూడ నాలో నాకే సిగ్గగుచున్నయది. నాకీమరణము సంభవిల్లుటకు గారణము మాధవ, సూనుల మాయావాగురలేకాని వేరొండేమియు లేదని చెప్పఁదగు. "జాతస్య మరణం ధృవ" మను యార్యోక్తికిఁబలె యెప్పటికైన చావుఁగలదేగాని ధాన్యకటకముననున్న యీముష్కరాధముల నంతమొందింపకుండ యేఁగుటవలన నాకుఁబలె యెందరో యీదుష్టుల దుర్వ్యూహములకుఁ జిక్కుదురనుట నిజము.



కష్టా! మాధవుని మాయావాగురలకు నేనేకాక నామనోహారియునుఁ జిక్కి యాత్మహత్యకుఁ బాల్పడినదని విని నప్పుడు ఎట్టి కఠినాత్మునకైనను గుండె వ్రక్కలుగాకుండునా?

ఆహా! సుందరీ! నీవేమొ పెక్కురోజులీభూమిపై జీవించగలవని యెంచి మృత్యుదేవత పాలుఁబడకుండ నుండుటకుగా లేఖనంపితిగాని ఇంతలో నీవిట్టి ఘోరహత్యపాలయ్యెదవని యెఱుంగనైతినిగా?

నేనీభూమినిఁ బాయుటతోడనే నేనే దిక్కని నాపై ప్రాణములుంచుకొని జీవించుచున్న నాతలిదండ్రులింక నీధరణిపై మనగలరా? ఏటిమాట?

హా! నేటికి రణోల్లాసునివంశము నీధరణిపై లేకుండఁ జేసివైచితివిగా? మాధవా!

మాధవా! నీకు మేమేమియు నణుమాత్రమైన నెగ్గుఁజేసి యెఱుంగమే యట్టిమాపై నీకేల యిట్టియీర్ష్య జనింపవలసి వచ్చినది?

అయ్యో! ఇదియేటిపిచ్చినాకు. దుష్టులకు సదసద్విచారమెక్కడిది?

కష్టకాలమున నెట్టిహితులైన నుపచరింపరనుటకుఁదార్కాణము, నాకు బలవర్ధనుఁడే గనుఁబడుచున్నాఁడు. నిజముగా యాతఁడు నాకెంతటిపరమమిత్రుఁడుగా నుండెను. నేనికారాగా

రబద్ధుఁడ నగుటతోడనే యెటకేగెనో ఎచ్చటను జాడలేద
య్యె;" అని రంజితుఁడు ధాన్యకటకమందలి కారాగారమందు
చింతించుచుండెను. అట్టితరి పదునెనిమిదివత్సరములఁ బ్రాయము
గల రాజకీయోద్యోగి యొకఁడా కారాగారముఁ బ్రవేశించి రంజి
తునితో నిట్లు ముచ్చటించెను.

ఉద్యో:—రంజితా! ఏల నీవిట్లుచింతించుట? ఇట్లు మనోవ్యథచేఁ
గృశించిన వచ్చెడి లాభమేమి?

రంజి:—అయ్యా! చచ్చుటకు సిద్ధముగానున్న వానికి మనోవ్య
థచేఁగృశించిన నేమి. ఇంకేమైన నేమి?

ఉద్యో:—అయ్యో! ఎంతటిపిచ్చివాఁడవు? ప్రాణమున్నంతవఱకు
బ్రయత్న మొనరించవలయునుకాని ఇవ్విధముగా చిం
తించుచుండిన నేమిప్రయోజనము?

రంజి:—అవును. మీరుఁ జెప్పినట్లు 'మనుష్యప్రయత్నలోపము
కలుగకుండఁ జేయుదమన్న శృంఖలాబద్ధుఁడనై యీకా
రాగారమందున్న నేనేమిచేయగలను? మరియు నాతం
డ్రియైన ప్రయత్న మొనరించు నేమోయనుకున్న నా
యనయు ప్రస్తుతము గ్రామమున లేక మగధపై తన
సైన్యవిన్యాసముఁ బరపుచున్నాఁడు. ఇదివఱకు నాకు మి
త్రులుగానివా రెవ్వరును లేరు. నేఁడు నాచెలికాఁడొక్కఁ
డును సహాయ మొనరింపఁ జాలఁడయ్యె. కావున ఇఁక నేఁ
జేసెడునదేమి?



ఉద్యో:—అయిన నేమికాని నీకొక హితోపదేశముఁ జేసెద
రమ్ము.

అని తనవద్దకుఁ బిలచుకొని నొకగడియసేపు యేమేమొ
చెవిలోఁ జెప్పి రంజితుని సంకెలలఁ దీసివైచెను. పిమ్మట
నెండొరుల దుస్తుల మార్చుకునిరి. వచ్చిన యతఁడు శృంఖలా
బద్ధుఁడై కారాగారమందుండెను. రంజితుఁడు రాజకీయోద్యోగి
దుస్తుల ధరించి కారాగారము వెడలెను.



# క మ ల

—:o:—

## తొమ్మిదవ ప్రకరణము.

### రణము.

గీ॥ విజయలక్ష్మిని యొనగూర్చు విపులముగను
కష్టములఁ బారదోలును స్పష్టముగను
ఎన్నియో మేలు లొనగూర్చు నెన్న ధైర్య
శౌర్యసాహసములుఁగల సజ్జనునకు॥

భరతఖండమునకు శిరోభూషణమై చంద్రగుప్త, అశోకాదిమహారాజులయొక్క యేలుబడిచేఁ గీర్తిఁగన్న మగధరాజ్యము తన తొంటిప్రాభవమునంతనుఁ గోల్పోయి యవన, శక, పహ్లావాది శత్రుప్రచయముచేఁ జుట్టుముట్టఁబడి అంతఃకలహములచేఁ గళలనన్నింటినిఁ గోల్పోయి నాశనమగుటకు సిద్ధముగానున్నతరి కృష్ణా, గోదావరీ నదీమతల్లులకును పూర్వపశ్చిమసముద్రములకును మధ్యనున్న భూభాగమునకు ఱేఁడై సమస్తధర్మములతోఁ బ్రజారంజకుఁడై పరిపాలించుచున్న ఆంధ్రవీరుఁడగు శ్రీముఖశాతవాహనుఁడు పరదేశీయులచే తన యవిచ్ఛిన్నరాజ్యమునకును కీడువాటిల్లఁగలదని యెంచి శాత్రవనిర్మూలనమొనరింపఁదలఁచి, తన సర్వసైన్యాధిపతియగు రణోల్లాసునికి కొంతసైన్యమిచ్చి మాగధపై కంపెను. వాఁడును తన యవక్రపరాక్రమవీరులఁ గైకొని మాగధకరుదెంచి యవన, శక, పహ్లావాదిశత్రువుల నుగ్గునూచముగాఁ దునిమి పారదోలి మాగధను ముట్టడించి సహాయసైన్యమంపుమని రాజునకుఁ దెల్పి రాజాజ్ఞకై యెదురు చూచుచుండెను. శ్రీముఖుఁడును సైన్యాధిపతియొక్క విజయమునకును మాగధ జయించుటకు సహాయసైన్యమంపుమని యాతఁడుఁ దెలియపఱచుటకును ఆనందపారవశ్యుఁడై తనప్రచండాంధ్రవీరుల గైకొని రణోల్లాసునకుఁ దోడ్పాటొనరించ నేగెను.

రణోల్లాసుని సైన్యమును శ్రీముఖుఁడుఁ గైకొనియేగినసైన్యమును కలసి యేబదివేలకాల్బంటులును, ఇరువదివేల యాశ్వికదళమును, వేయిద్విరదములపంక్తియుఁగలిగి నొప్పారుచుండెను. నూతనమార్గముల నారితేరినవారగుటచే యాంధ్రవీరులు రణమనిన పండుగగా బయలుదేరుచున్నారు. అందువలన విజయలక్ష్మి వారి కరతలామలకమై యుండెను.

శ్రీముఖుఁడును సైనికులును తనసైన్యముతోఁ కలయుటతోడనే, రణోల్లాసుఁడు శ్రీముఖునికి సర్వసైన్యాధిపత్యమిచ్చి తానుపసైన్యాధిపతియై సైన్యమంతయు మాగధకోటపైఁ బఱపి ముట్టడించెను.

అప్పటికి మాగధయందు సర్వరాజ్యతంత్రములు తాను గైకొని రాజును యంతఃపురవాసినిగాఁజేసి తానే రాజై మెలంగుచున్నాఁడు సుశర్మయను మంత్రిపుంగవుఁడు.

ఆంధ్రులు కోట ముట్టడించుటతోడనే మాగధవీరుల నందఱి నాయత్తపఱచుకొనిసుశర్మ యాంధ్రులతోఁ ఢీకొనెను.

అంత మాగధులకు ఆంధ్రులకు బోరు ఘోరమయ్యెను. ఆంధ్రులకుత్సాహమైన రణగీతములఁ బాడుచు నొక నవయౌవన యోగిపుంగవుఁడు శ్రీముఖుని సైన్యమంతటను సంచరించుచున్నాఁడు. ఆతని సంగీతమేళవముచే నుచ్చరింపఁబడుచున్న రణగీతములనువిని వీరోత్సాహము నొందనివాఁడానాఁడాయాంధ్రవీరులలో నొక్కఁడైన లేఁడనియేఁ జెప్పదగు.

అట్లు మాగధవీరులు, ఆంధ్రవీరులుపరాక్రమముగనే పోరుచుండిరి. కాని మాగధులు రణకౌశలత్వము నెఱిగినవారుకారు. ఆంధ్రులు యారితేరిన రణవిద్యాకౌశలులు. అందుచే యాంధ్రవీరుల శరములకు మాగధులు మ్రగ్గుచుండిరి. ఇవ్విధముగా సైనికులు రణమొనరించుచున్నను శ్రీముఖుఁడు తన నిర్వ్యక్రపరాక్రమముఁ జూపుచు తానును యాహవమున మాగధులఁ బరిమార్చుచుండెను. సుశర్మయు స్వయముగనే పోరుచు ఆంధ్రసైనికులఁ దునుమాడి శ్రీముఖుఁడున్న దిక్కునకుఁ బరతెంచుచుండెను. ఇంతలో సుశర్మయంగరక్షకుఁడగు ధూర్తుఁడు శ్రీముఖునిపై నొకశరమును వదలెను. కాని శ్రీముఖుఁడు మాగధయోధునితోఁ బోరుచుండుటచేఁ యయ్యదిఁ జూడఁడయ్యెను. ఇఁక నొకత్రుటికాల మాలస్యమైనచో శ్రీముఖునకాశరముఁదాకి నీభూమికి దూరగుడయ్యెడువాఁడుకాని, అట్టితరి శ్రీముఖునికిదాపున రణమొనరించుచున్న



యాంధ్రవీరుఁడొకఁడాయుదంతముఁ జూచి తత్క్షణమాశరమును తన బాణముచే తుత్తునియలొనరించి, శ్రీముఖునియసువులఁ గాపాడెను. అంత ఆయుద్యమమునంతయు నెఱింగి శ్రీముఖుఁడు ప్రచండమూర్తియై తనబాణపుంఖములచే మాగధుల నురుమాడుచు సుశర్మఢీకొని స్వయముగా తన కరవాలముచే సుశర్మశిరము దునిమి జయలక్ష్మిఁ గైకొనెను. నాయకుఁడుఁ జచ్చుటతోడనే మాగధులు చెల్లాచెదరైరి. కోట యాంధ్రులకు వశమయ్యెను. జయజయధ్వానములతో శ్రీముఖుఁడు కోటప్రవేశించి, మాగధగద్దె నధిష్ఠించి దానికి శాసనకర్తయై యుటతనకుగాను రణోల్లాసుని ప్రతినిధిగానునిచి, కొంత సైన్యమటనుంచి, రణవీరాగ్రగణ్యులగు యోధులను మిగత సైనికులను గలసికొని శ్రీముఖుఁడు సంతోషస్వాంతముతోఁ దులదూగుచు నిజరాజధాని ప్రవేశించెను.



# కమల.

## పదియవప్రకరణము.

### ఉరిశిక్ష.

గీ॥ సత్యమే సర్వవిధముల సౌఖ్యపదము
సత్యమే గౌరవంబుకు స్థానమరయ
సత్యమే జయచిహ్నంబు స్థైర్యవసతి
సత్యమే కారణము గాదె సంపదలకు॥

నేఁడు పూర్ణిమయగుటచే రంజితునిశిక్ష జరుపుదినమై యుండెను. కాని క్రమమో యక్రమమో నేరము మోపఁబడి శిక్షవిధింపఁబడిన రంజితునకు బదులిప్పుడు కారాగారమునం దొకయనపరాధియగు రాజకీయోద్యోగి కపటరంజితవేషధారుఁడై యున్నాఁడని మా చదువరులెఱింగిన విషయమే; అయినను వానినే యిప్పుడపరాధియని నెంచి యురిదీయఁగై కొనిపోఁబోవుచున్నారు. కాని నేరస్థుని యురిదీయుటకుముందు రాజుగారియుత్తర్వుఁ బొందవలసియున్నది. అందులకై కారాగృహాధికారి రాజసమ్ముఖమునకే తెంచుచున్నాఁడు. మనమును యాతని వెంటనే దర్బారునకే తెంతమురండు. ఎందులకు మనలనుగూడ దీసికొనిపోవుచున్నారు రాజసభకని శంకింతురేమో మా చదువరులు; నేఁడాంధ్రదేశపరిపాలకుఁడగు శ్రీముఖశాత



వాహనమహారాజు మగధ జయించుటచే మాగధరణమందు జయోపేతులై పరాక్రమమును వెల్లడించిన యాంధ్రవీరులకు బారితోషికములిచ్చుటకుఁగా సభఁజేయుచున్నాఁడు. కావున మా పాఠకులకుఁగూడ యయ్యది యానందదాయకముగానుండునని యెంచి రాజసభాప్రవేశ మొనరించుచున్నారము.

సభాభవనమంతయు నానావిధవస్తుజాలములచే నలంకరింపఁబడి దేదీప్యమానకళలచే నొప్పారుచుండెను. సభికుల కుచితమైన యాసనముల సభాస్థలి నమర్చిరి. సభానియమితకాలమునకెల్ల రాజకీయోద్యోగులు, వీరులు, సభాస్థలి కరుదెంచి తమతమ యుచితాసనముల నధిరోహించిరి. ఇంతలో రాజచిహ్నవసనధారుఁడై శ్రీముఖుఁడును సభాస్థలి కరుదెంచెను. సభికులును తమతమ యాసమునములనుండి లేచి రాజగౌరవమును చూపిరి. తదుపరి రాజుగారును సింహాసనము నధిష్ఠించి సభికులను విష్టరముల నధిష్ఠింపఁజేసి యిట్లుపన్యసించెను.

"ఓయాంధ్రవీరాగ్రగణ్యులారా! సభాసదులారా!! నేఁడాంధ్రదేశమునకంతకు నానందశూచకమగు దినము. మాగధయందు మీరుఁజూపిన యసమానపరాక్రమమునకెంతయు నాడెందమానందమయ్యె; మీరటఁజూపిన శౌర్యమునకు ప్రస్తుత హిందూదేశమున నచ్చెరువందని వాఁడెవ్వఁడును నుండఁడని చెప్పఁదగు. మఱియు నేను మాగధులతోఁ బోరు

నప్పుడు ధూర్తుని శరమునుండిఁ గాపాడి నా యసువుల నిలిపిన యాంధ్రవీరోత్తమున కెంతయు నేను కృతజ్ఞుఁడ. ఆవీరాగ్రగణ్యుఁడు తనపావనచరితంబుఁ దెలిపి నన్ను ధన్యుంజేయు వేడెద." అని శ్రీముఖుఁడు నుడువుచుండగనే నొకచారుఁడరుదేరి "దేవా! తమదర్శనార్థ మొక యోగిపుంగవుఁడరుదెంచియున్నాఁడు" అన "వేగమ యాతని ప్రవేశపెట్టునది" అని యుత్తరువిచ్చెను. ఇంతలోఁగారాగారాధిపతి యేగుదెంచి రంజితుని వృత్తాంతమంతయుఁదెల్పి యురికి ననుజ్ఞనొసంగ వేడెను. అంతట ఉన్నతోద్యోగులందఱు "ఇట్టియానందదినమున దుఃఖకరమగు కృత్యముఁ జేయింపఁజనదు" అని యేకగ్రీవముగా నుడివిరి. అట్టితరి యోగిపుంగవుఁడరుదేరి రాజుచే నుచితమర్యాద లందియొకయుచితాసనాసీనుఁడయ్యెను. అంత రాజును యోగియు నిట్లు ముచ్చటించిరి.

రాజు:—అయ్యా! తమ్మింతవరకుఁ దోడ్తెచ్చినకార్య మెద్దియోవిన మీదాసుఁడు త్వరపడుచున్నాఁడు.

యోగి:—రాజా! మాబోటివారి కేమిపనియుండును. "పరోపకారార్థమిదంశరీరం" అను యార్యోక్తి నమ్మినవారమగుటచేఁ బరుల కుపకారార్థముఁ బెనగులాడుచుందుము.

రాజు:—తామిప్పు డుపకార మొనరింపఁదలచిన మనుజుఁడెవ్వఁడో వేగిరమఁదెల్పి యీభృత్యుని యలమట దీర్పుఁడు.



యోగి:—నరోత్తమా! ఇంతదనుక కష్టపడియేతెంచి ఆయుదంతముఁ దెలుపకుండుటెట్లు? కావున ఆకథనంతయు నీవును సభాసదులును చిత్తంబులు పరాయత్తంబులుఁ గాకుండునట్లుఁ జేసి సావధానులరై వినవేడుచున్నాఁడ. ధాన్యకటకమున నొకయున్నతరాజకీయోద్యోగి కొక సుపుత్రుఁడుఁగలఁడు. అతఁడును ఇంకొక రాజకీయోద్యోగిపుత్రుఁడును మిత్రులరై యలరారుచున్నారు. కాని మొదటివానికిని రెండవవానికిని ప్రవర్తనయందును బుద్ధియందును అనేకాంశములు తారతమ్యములుఁగలవు. మరియు రెండవవానికొకదుష్టుఁడు మిత్రుఁడై తన స్నేహబృందమునంతను వానికిఁబరిచయులఁ జేసి వానిని తమయంతవానిగాఁ జేసి యెట్టి ఘోరకార్యములనైనఁ జేయింపసమకట్టెను. మొదటివాఁడును ఆతని చెలికాఁడును రెండవవాని నాదుండగీఁడుల స్నేహమునుండి తప్పించుటకునై యనేకవిధముల హితబోధఁ జేసిరి. కాని అవి యెల్లవారికిఁగర్ణకఠోరమై వీరియందొకవిధమైన యసూయాభావ ముద్భవింపఁజేసెను. అట్లు వారు పరస్పర మీర్ష్యాకులులై యున్నతరి వీరబహుమానోత్సవ మొకటియరుదేర ఆపారితోషికమున కావీరులిరువురుయత్నించ నందు మొదటివాఁడే విజయ

మొందెను. అందులకాతనియందు రెండవవానికి మరింత ద్వేషము మెండై తనమిత్రతతియొక్క ప్రోత్సాహముచే మొదటివానిని సంతమొందింపఁ దలఁచి యుండెను. అట్టితరి రెండవవాఁడిప్పుత్తనమందేయున్న యొకబ్రాహ్మణయువతిని మోహించి ఆవార్త యామెకుఁ దెల్ప అందుకాకాంత యాతని యాయుద్యమమునుండి మరల్పఁదగువిధమున హితబోధఁ జేసెను. కాని అవి యెవ్వియు వానిమనస్సున కెక్కక ఆయమ పతినిఁ గడతేర్చి ఆహింస మొదటివానిపైఁ బెట్టిన తనశత్రువు కడతేరుటయు తనకాయింతి సులభముగా లభ్యమగుటయు నను రెండుఘనకార్యము లొనరించిన మహానుభావుఁడఁ గాదలఁచి తనమిత్రబృందముచే నాబ్రాహ్మణుని సంతమొందించెను. కాని ఆబ్రాహ్మణి వానికి సులభముగాఁ దక్కుటకుబదులు పతి మరణాంతరము గ్రామాంతరమేగి కృష్ణానదీమతల్లి గర్భమునఁ జొచ్చి యసువుఁ బాసెను. అంత ఆకోర్కె విఫలమైనను తనశత్రువైనఁ గడతేర్చిన కొంతసంతసముఁ గలుగుననియెంచి, ఆప్రాణిహింసానేరము మొదటివానిపైఁ బెట్టి తానును తనమిత్రులును సాక్ష్యముఁ జెప్పి మొదటివానికి దేహాంతకశిక్ష విధించినాఁడు. ఆశిక్ష నెరవుదినము నేఁడై యున్నది.



మరియు దుష్టమిత్రమండలితో మొదటివానిని సంతమొందించుటకుఁగాను రెండవవాఁడు జరపిన యుత్తరప్రత్యుత్తరము లివేఁగనుఁడు. ఈ యుదంతమంతయు విచారించి నిరపరాధి మన్నించి అపరాధులశిక్షించవేడుచున్నాఁడ.

అంత శ్రీముఖుఁడు యోగియిచ్చిన కాకితములకట్టఁ గైకొని అందలి ముఖ్యమైనవానిని రెండింటినిఁదీసి దాపుననున్న నొకయుద్యోగికీయ నాతఁడందఱువినునట్లు యిట్లు చదువఁదొడఁగెను.

"నాప్రియమిత్రవతంసులారా!

మనమిదివరకనుకొన్న ప్రకారమీరోజుననే బ్రాహ్మణునిఁ గడతేర్చుదము. అందువలన మనశత్రువగు కమలప్రియుఁడు గడతేరుటకు మార్గమును నాకోరిక నెరవేరుటయు జరుగును కావున మీరు నన్నెటకలుసుకొనుమనునది వేగిరము తెలియఁబరుపుఁడు. మిత్రుని యాశీర్వాదములఁ గైకొనుఁడు.

ఇట్లు మీ ప్రియమిత్రుఁడు మాధవుఁడు."

"సఖా! నీలేఖయంది మిత్రుల డెందమానందపరచెను. నీయిష్ట ప్రకారమీ రాత్రియే నాకార్యముఁ జేయ సమకట్టితిమి. ఈపని నెరవేరినతక్షణమే రంజితునిఁ గడతేర్చు యుదంతముఁ జేసి, పిదప ఆయనను కామించిన కమలవిషయ

మై ప్రయత్నింతము. ఈరాత్రి రెండుయామములగుసరికి పత్తన ప్రాగ్దిశయందున్న వటవృక్షముకడకరుగుము. అట మమ్ములఁ గలిసికొనవచ్చును. మిత్రులవందనములఁగైకొనుము.

ఇట్లు మిత్రమండలి కార్యదర్శి, సూనుఁడు."

అని రెండులేఖల యాయుద్యోగిఁ జదువుటతోడనే సభాసదులును రాజును ఆచరిత్రకంతకు యాశ్చర్యమానసులైరి అంత రాజుగారు రాజభటులఁబిలచి తత్క్షణమామిత్రమండలిని మాధవునుఁ బట్టితెచ్చునదియని యనుజ్ఞనిచ్చెను. రాజాజ్ఞ యగుటతోడనే రాజభటులరుదేరి మాధవ సూనులబట్టిరి కాని మిగత దుష్టచయమంతయుఁ జిక్కరైరి. మాధవ, సూనుల సభాస్థలికిఁ దోడ్తెచ్చుటతోడనే రాజుగారు వారినిరువుర తన సింహాసనము వద్దకురప్పించి లేఖల రెండింటినిచూపి అందలివ్రాతయు చేవ్రాలును ఎవరివనియడుగ తమవియేనని నొప్పుకొనిరి. అంతట రాజుగారాచరిత్రనంతను నడుగగాఁదమ కపటనటనయంతయుఁ బయలువడినదనియును అందుచే నిఁక శిక్ష తమకుఁ దప్పదనియెంచి తాముఁజేసిన యుదంతమంతయుఁ దెలియపరచిరి. అట్లు మాధవ,సూనులచరితము వినినపిమ్మట రాజుగారు కారాగారాధిపతితో రంజితునిఁగైకొనిరమ్మనిముదలజేసెను. అట్లేయాతఁడు కపటరంజితునిఁ గైకొనివచ్చి సభాస్థలి నిలిపెను. అంతట రాజతని చరితమడుగ అతఁడేమియు ననఁజాలక మిన్నకుండెను.



ఇంతలో సభాస్థలినుండియొకయౌవనయాంధ్రవీరుఁడు లేచి రంజితుని చరితమంతయుఁజెప్పి తానే రంజితుఁడననియు శ్రీముఖుని మగధరణరంగమునను నాపదనుండిఁ దప్పించినవాఁడు తానేననియు అప్పుడు రాజుగారిచ్చిన కైజామునుచూపి ప్రస్తుత రంజితవేషధారుఁడై యున్నవాఁడు తనరక్షణకొఱకై మాగధరణరంగమున రాజుగారికి దోడ్పాటొనరింపఁ దన్నంపి కారాగారమందుండిన పరోపకారశీలుఁడనియు నుడివెను.

అంతట రాజుగారు కపటరంజితవేషధారుఁడైన వానిని "అయ్యా! మీరిట్టి పరోపకారశీలురై న్యాయైకపక్షావలంబులగుట కెంతయు సంతసము కాని, తమ పావనచరితము వెల్లడించి మమ్మందఱ నానందాబ్ధి నోలలాడింప వేఁడెద" అనఁ ఆతఁడు తనచరిత మిట్లునుడివెను.

"ఆంధ్రరాజ్యరక్షాదక్షా! ఆంధ్రవీరాగ్రగణ్యులారా! నేను సత్యవంతుఁడను రాజకీయోద్యోగుని కుమార్తెను, కమలను. నేను రణోల్లాసుని పుత్రుని వరించితి. ఆతఁడును నన్ను ప్రేమించియుండెను. అట్టితరి మాధవుండు నామనోహరునిపై హత్యనేరముమోపి కారాగారమునకుఁ జేర్చెను. తదుపరి నన్ను తనపాణిఁబట్టుమనియు, అట్లొప్పనేని బలవంతముగా నన్ను స్వీకరింపఁదలచినట్టులను లేఖలంప మొదలిడెను. దుష్టునికి దూరముగానుండుట మంచిదనియెంచి నొకయర్ధరాత్రి

మున మాసౌధమునుండి నాచెలిమికత్తెతోఁ గృష్ణానదీమతల్లి
వద్దకుఁ జని ఆయమతో నా దీనచరిత్రయంతయుఁ జెప్పి మాన
రక్షణార్థమై కృష్ణానదీమతల్లిఁ జొచ్చి యసువుల బాసెదనని చె
ల్పి యొకలేఖ నాతండ్రికి వ్రాసియిచ్చి, ఆమె నంపి, తరువాత
ఆత్మహత్యఁ జేసికొన నుద్యమించియు నాప్రియుఁడు కారాగా
రమున కేతెంచునప్పు డంపినలేఖ జ్ఞప్తిరా మరల నైజప్రా
ణముల నిలుపుకొనుట యుత్తమమని యెంచి ఆయుద్యమము
నుమాని యెవ్విధముగానైన నామనోహరుపై మోపఁబడిన
యక్రమపునేరమును బాపసమకట్టి పురుషవేషము ధరించి కారా
గారాధిపతికి సత్యవంతుని సోదరుఁడననియు నేరస్థునితో నవ
సరమైనవిషయముల మాటలాడుటకుగా సత్యవంతుని యనుజ్ఞ
నై యున్నదననియుఁ జెప్పి సమ్మతిపరచి లోపలికేగి నాప్రియుని
తో నేనొకయుద్యోగిననుడివి ఆయనకు రహస్యముగా మాగ
ధయందు జరుగుయుద్ధమున రాజునకు సహాయ్యమొనరించి
నచో శిక్ష దప్పుననియు అట నీపరాక్రమమంతయుఁ జూపి జయల
క్ష్మిఁ గైకొన్నమనియు అంతదనుక వేషధారినై నేనందుండఁగల
ననియుఁ దెల్పి అతనిని సమ్మతిఁ బరచి ఆయనబదులు నేను కారా
గారమందుండి నాధర్మమును నేను నెరపితిని. కావున ఆంధ్ర రా
జ్యరమాశాసకులగు రాజుగారు నావిజ్ఞాపన మాలకించి నిరపరా
ధియైన నాపతియొక్క శిక్షఁ దొలగించి నాకుఁ బతిభిక్ష పెట్టవేడు



చున్న దాన” అని నుడువుట తోడనే సభాసదులును రాజుగా
రును ఆశ్చర్యమగ్నమానసులైరి. అంత రంజితుఁడు నిరపరాధి
యని సభాసదులును రాజును యేకగ్రీవముగా నంగీకరించి
కమల పతిభక్తి కెంతయు సంతసమొందిరి. అనంతర మారాజు
గారు రంజితుని యురిశిక్ష రద్దుపరచి అపరాధులగు మాధవ
సూనులకు దేహాంతకశిక్ష విధింపవలసియున్నను గనికరించి వారి
రువురకు యావజ్జీవకారాగృహనివాసశిక్ష విధించెను. పిమ్మట
రంజితుని శౌర్యధైర్యములకు మెచ్చి తన యంగరక్షకోద్యోగ
మిచ్చుచు నానావిధసువర్ణపతకముల బహుమానమొసంగి కమ
లారంజితులవివాహము నెరపునట్లుఁ దెలిపి సభఁ గావించెను.



# కమల.

## ఉపసంహారము.

యోగి రంజితుని చెలికాఁడగు బలవర్ధనుఁడని మాచదువరులకుఁ దెలిసియే యుండవచ్చును. రంజితునిపై హత్య మోపఁబడుటతోడనే యోగివేషధారుఁడై యాదుష్టమిత్రమండలిస్థానము నన్నిటిని కనుఁగొని వారిలోఁ జరుగు సుత్తరప్రత్యుత్తరములకట్ట సంపాదించి మాగధయుద్ధమందు యాంధ్రవీరులకు వీరోత్సాహముఁ బురికొల్పి తదుపరి నతనవద్దనున్న కమ్మల రాజునకుఁజూపి రంజితుని శిక్షనాపి మిత్రత్వము యొక్క భావము వెల్లడించెను.

నిజముగా స్నేహితులన్న నట్టివారేగాని భాగుగ నుండునపుడె యెక్కుడు చెలిమిఁజూపి కష్టకాలమున దమకుఁదెలియనట్లు నటించు పరమద్రోహులామిత్రులు?

శ్రీముఖుని కోరికప్రకారము సకలవైభవములతో రంజిత కమలలకును బలవర్ధన సుమంజరులకును పాణిగ్రహణ మహోత్సవము కోటయందే జరిగెను. పాణిగ్రహణకాలమునకు మాగధరాజప్రతినిధియగు రణోల్లాసుఁడుగూడ నరుదెంచి తనకుమారుని యొక్క చరిత్రయంతయు వినియచ్చెరువందెను. సత్యవంతుఁడును అతనిభార్యయు దమకుమార్తెయొక్క య



ద్భుతచరిత్రమున కానందపరవశులై స్వయముగా రంజితునకుఁ దమకుమార్తెయగు కమలను సాలంకృత కన్యాదానమొనరించి ధన్యులైరి.

ఈగ్రంథమూలమున పరిచయులైన, శ్రీముఖశాతవాహనమహారాజును ఆంధ్రరాజ్యరమనేలవదలి, రణోల్లాసుని మాగధరాజ్యరమాప్రాతినిధ్యమునిర్వహింప విడచి, సత్యవంతాదిరాజకీయోద్యోగుల దమ నియతకృత్యముల నెరవేర్పఁబోనాడి, నూతనయౌవనదంపతులగు రంజితకమలలను, బలవర్ధన సుమంజరులను, చిరకాలమనోరథ మీడేర మదనసామ్రాజ్యమేలవదలి, ముందర చరిత్రవ్రాయుట చరిత్రకారులకువదలి పాఠకమహాశయులవద్ద సెలవుఁగైకొని, మా లేఖరులను నింతటితో సమాప్తినొందించి విరమించుచున్నారము.

సమాప్తము.



ఆంధ్రవాణి.

నియమములు.

౧. వత్సరమునకు మూడాంధ్రగ్రంథములు పంపబడును.
౨. గ్రంథములన్నియు నవలలై యుండును.
3. శాశ్వతపు జందాదారులకు గ్రంథములు చవుకగా నందబడును.
౪. శాశ్వతపు జందాదారులకు పోస్టేజీకాక ౧౦౦ పుటలకు ౦-౪-౦ వంతున యివ్వబడును.

ప.రా:—నియమముల మార్చుటకుస్వతంత్రతగలదు

ఇట్లు, ఆంధ్రవాణి,
ఇనగల్లు,
పెదనందిపాడు పోష్టు,
గుంటూరు జిల్లా

# రాబోవు గ్రంథము

# మరాళ

ఇది ప్రస్తుతమాంధ్రదేశ చరిత్రాత్మకమైన నవల. ఇందు రాచకీయ, సాంఘిక, నైతికవిషయములు విపులముగా జర్చింపబడినవి. కొలదిరోజులలో యాంధ్రవాణీ చందాదారుల కంద జేయబడును.

గ్రంథకర్తలు:—టి. కేశవరావు,
ఆర్. వేంకటప్పయ్య.

## సత్యాబాయి

ఇదియొకచరిత్ర విషయికనవల. మృదుమధుర
రచింపఁబడినది. 140 పుటలగ్రంథము. వలయువా
చిరునామాకు వ్రాసినఁబడయఁగలరు. వెల.0-6-0లుపోస్టే

## తిమ్మాపురపుశతావధానము.

ఇది బ్రి. శ్రీ. రాళ్ళబండి వేంకటసుబ్బయ్యగారి ప్రశ్
పద్యములు మృదుమధురశైలిని నొప్పాలుగులుకుచుం
సత్యాబాయి, బుధకుమారచరిత్ర, కొనినవారికిపొ త్తప
ముగా నివ్వబడును. వేరుగా కొనువారికి వెల రు 0-1.

## స్నుషావిజయము.

ఇది చక్కని ప్రహసనము. వెల. రు. 0-2-(

## ప్రకటన.

ఆంధ్రవాణియందు ప్రచురింపఁబడు బుక్కులన్ని
ఆంధ్రదేశమందలి పుస్తకభాండాగారములకు, స్త్రీసభ
ములకు సగము వెలలకు నివ్వఁబడును.

ఇట్లు, ఆంధ్రవాణి,
ఇనగల్లు, పెదనందిపాడు పోష్టు
గుంటూరుజి

Printed at Chandrika Press, Guntur.

